

బుద్ధం సత్యనారాయణ ఎమ్. ఏ. బి. ఇడి; గురుస్థానంలో చిత్ర లేఖనా చార్యుడుగా వీరేశలింగ ఆస్తికోన్నత పాఠశాల. ఇన్నీసుపేట రాజమండ్రిలో ప్రస్తుతం ఉద్యోగం చేస్తున్నాను శ్రీ బుద్ధా పరసురామ్ నారాయణమ్మ గార్ల ప్రథమకుమార్డుగా జ. తే15-7-1948 రాజమండ్రి. శ్రీశ్యామలాంబ మున్సిపల్ ఎలిమెంటరీస్కూల్ లోను, శ్రీవీరేశలింగ అస్తిక ఉన్నత హైయ్యర్ సెకండరీ పాఠశాలలోను. ఆంధ్రా యూనివర్సిటీలోను (ప్రైవేటుగా) చదివితిని. ఆంధ్రప్రదేశ్ స్టేట్ టెక్నికల్ పరీక్షలలోను టి.టి.సి. ట్రైనింగ్ లోను మద్రాస్ టెక్నికల్ హైయ్యర్ డ్రాయింగ్ పరీక్షలలోను ప్రథమస్థానములో ఉత్తీర్ణుడనైతిని గురుదేవులు శ్రీమాన్ మరంగంటి సీతారామాచార్యులు **EX** డ్రాయింగ్ మాస్టర్ బొంబేడిప్లమో వి. టి. ఎచ్. ఎస్. స్కూల్

**1994-95** సం॥న తూ॥ గో॥ జిల్లాకు ఉత్తమ చిత్రలేఖ నోపాధ్యా యునిగా గౌరవించబడితిని

ఆశయం :– శ్రీగురు వాక్యానుసారము అనంతమైన విద్యలోనేను నేర్చిన విద్యను ఆశక్తిగల విద్యార్థులందరికి నేర్పుట.

హరిః ఓం తత్సత్ శ్రీ కుసుమహర

నిత్య జీవితంలో సులువు చిత్రాలతో

శ్రీ సీతారామాచార్య

# చిత్రకళా ప్రకాశిని

వివిధ రకాల రేఖాచిత్రాలు ' సింపుల్‌స్టిక్ డ్రాయింగ్స్ ' డిజైన్లు
ఆబ్జెక్ట్స్ ' లాండ్ స్కేప్స్ ' మానవ చిత్రాలు






శ్రీం. గురుబ్రహ్మః గురువిష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురు సాక్షాత్ పరంబ్రహ్మః తస్మై శ్రీ గురువే నమః ॥

గం. శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోప శాంతయే ॥

* శుభం భూయాత్ *

చిత్రకళామృత కలశంలో ఆదిబిందువు
ఆగష్టు 1995
కాపీలు 1000
(సర్వ స్వామ్యములు గ్రంథకర్తవి)
రూ. 6/-
ACC No 20580
ప్రతులకు :
బుద్ధా సుబ్బలక్ష్మి
42-14-27 పల్లపు వీధి, కొత్తపేట,
మున్సిపల్ స్టేడియం గ్రౌండ్ వెనకగేటు వద్ద,
శ్రీ సీతారామాచార్య బాలచిత్రకళా వికాస్,
రాజమండ్రి. - 533 101

బ్లాకులు :
శ్రీ వెంకటేశ్వర ప్రాసెస్
జండాపంజా రోడ్ - రాజమండ్రి.

ముద్రణ ;
అనురాధా ప్రింటింగ్ ప్రెస్
అన్నపూర్ణమ్మ పేట - రాజమండ్రి

# ఉన్నమాట

చిత్రలేఖనము - సాంకేతిక విద్య - చిత్రలేఖన విద్యయే అక్షయ సంపద - భగవంతుని వరప్రసాదము - చేతివిద్యలు సర్వజనులకు స్వయం ఉపాధిమార్గము - డ్రాయింగ్ ఒక టెక్నికల్ ఎడ్యుకేషన్ కావున పాఠశాలల్లో **SUPW** సాంఘిక ఉపయోగిత ఉత్పాదిత కృషిగా ప్రవేశపెట్టిరి.

ఒక గీతకి కొన్ని చుక్కల కలయిక ఒక చిత్రానికి కొన్ని గీతల కలయిక సప్త వర్ణాల సుందర కలయిక ఇంద్రధనస్సు సువర్ణాల మేలు కలియకయే సుందర చిత్రలేఖనం రేఖానిదానం వర్ణప్రదానం, భావని నాదమే నేత్రోత్సవమైన చిత్రకళాధ్యయనం పులకాంకిత సద్భావనోద్యమం. చిత్రకళ పరమార్థం సంఘసేవే ధ్యేయంగా కలది. కళల్ని నేర్చిన వారిజీవితం సారవంతమై ఆనందంతో నిండియుంటుంది సాధకులకు ప్రకృతి అందాల్ని చిత్రించేందుకు కళాకేళులై జీవం తొణికిసలాడే చిత్ర రచన- వర్ణవిచక్షణా జ్ఞానం కావాలి. ప్రకృతికి ప్రతికృతు లను రసవంతముగా రచించుటకు సౌందర్యారాధన, కళాపిపాస, స్వేచ్ఛా ప్రియతత్వం ఉండాలి తద్వారా అభ్యాసం చేతపావనహృదయం, సౌశీల్యగమనం కల్గియుంటారు. చిత్రకారుడి తపస్సు విశ్వకళ్యాణానికి జీవం,జవం, సత్వం లను ప్రసాదిస్తుంది. బాలలకు లేత హృదయాలలో మధుర రసమయ రేఖ వర్ణాల రచనాచమత్కృతిని సంతరింపచేయాలనే సత్సంకల్పంతో సులువు సూత్రాలతో కూర్చిన ఈ గ్రంథం రచించాను.

బాల కళాకారుల హృదయాలను ఈ నాకృషి రంజింపచేసి వారి కళా పురోభివృద్ధికి సువర్ణసోపానము కాగలదని నా ఆకాంక్ష

బుద్ధా

# బొమ్మలు వేయుట నేర్చుకొనేవారికి
# కావలసిన పరికరములు

1. డ్రాయింగ్ పేపర్లు :- 1 వాట్స్‌మేన్ పేపర్స్ పేంటెడ్ సైడ్ 1

2. డ్రాయింగ్ పెన్సిల్లు :- గ్రోస్లు H B,B,2B,3B. పెన్సిల్ ముల్లును ఎప్పుడూ సూదిగా చెక్కుకోవాలి.

3. డ్రాయింగ్ బోర్డులు :- జూనియర్స్‌కి 18 × 12 అంగుళాల సైజు (టేకు/చేవ/దేవదారు/ హార్డుబోర్డులలో) సీనియర్స్‌కి 18 × 24 సైజుగల ప్లైవుడ్ బోర్డు దొరుకును.

4. క్లిప్పులు / డ్రాయింగ్ పిన్నులు = 6

5. నెం. 1 క్వాలిటీ రబ్బర్లు నటరాజ/అప్సర ప్లాస్టో ఎరేజర్స్

రంగులు :- కేమిల్/ పెలికాన్ వి 6 రంగుల బాక్సు కేక్స్ – 1 కేమిల్ పోస్టర్ కలర్ సీసాలు వైట్ & బ్లాక్ కలర్స్‌తో సహా ప్రారంభంలో కేమిల్ స్టూడెంట్ వాటర్‌కలర్స్ ట్యూబ్స్ బాక్సు – 1 తరువాత కేమిల్ ఆర్టిస్ట్ వాటర్ కలర్స్ ట్యూబ్ బాక్సు – 1.

కలర్ మిక్సింగ్ పేలెట్స్ - 12గళ్ళవి 1 లేక 6 గళ్ళవి-1 తెల్లని పింగాణీ పలక - 6 అంగుళాలు చతురస్రం గలవి 1

బ్రష్‌లు :- కేమిల్, పైలెట్, సాబిల్ హైర్ రౌండ్ పాయింట్ బ్రష్‌లు (నాణ్యమైన బ్రష్‌లు కొనాలి)

సీనియర్స్‌కి నెం. 7,8,9,10,11,12 - జూనియర్స్‌కి నెం. 1,2,3,4,5,6

నీళ్ళకోసం 2 ప్లాస్టిక్‌వి పెద్దగ్లాసులు

☞ : పగటివేళ సూర్యకాంతిలోనే రంగుల బొమ్మలు వేయాలి. రాత్రివేళ కరెంటు వెలుగులో రంగులతో బొమ్మలు వేయరాదు. కృత్రిమ వెల్తురులో రంగుయొక్క అసలు స్వరూపం తెలియబడదు.

వ్యక్తిగతంగా:- మనోబలం దృఢవిశ్వాసం శ్రద్ధ ఆశక్తి పట్టుదల ఆత్మవిశ్వాసం వంటిసద్గుణాలుండాలి.మాట తక్కువ పని ఎక్కువ చేయగల్గియుండాలి.

# అంకితం



చిత్రకళా విలువకే ఊపిరిగా, విద్యార్థుల భవిష్యత్తే ధ్యేయంగా బాల ప్రపంచ ప్రేమనిధిగా, భావికళావేత్తల పురోభివృద్ధికి సారథిగా శ్రీ వీరేశలింగ ఆస్తికోన్నత పాఠశాలలో 28 సం॥లు ఉపాధ్యాయునిగా పనిచేసిన చిత్రకళావిద్యాబుద్ధులను నేర్పిన నాగురుదేవులైన పూజ్య శ్రీ శ్రీమాన్

## శ్రీ మరంగంటి సీతారామాచార్యులు

బొంబే డిప్లమో వారికి వినయపూర్వకముగా సమర్పించుచున్నాను.

శ్లో॥ కళాతత్త్వాభిజ్ఞః, సువిమల మనాః, ప్రేమవివశః
సదాచారః, శ్రీమత్ కమలనయనారాధన రతః!
కులాతీతో, విద్యావితరణ పటుః శిష్యదయితః
సదా సీతారామో, గురురభినుతః చేతసి లసేత్!!

శ్రీమచ్చిత్ర కళాప్రవీణుని సుధీశీతాంశునిన్ సజ్జన
స్తోమ స్తుత్య సుసాధు వర్తనుని సస్తోకాదృత ఛాత్రుని
స్నేహౌదార్యుని వైష్ణవోత్తము దయాసింధున్ గురుశ్రేష్ఠును
ద్ధామ ప్రీతి భజింతు నెల్లప్పుడు సీతారాము నాచార్యునిన్




**అభ్యాసరేఖలు:-** సాధనకు స్కేలు వాడరాదు

నిలువు రేఖలు కోణ రేఖలు కుడి, ఎడమలుగా **"S"** రేఖలు అల్లిక రేఖలు, కోణరేఖలు, అరసున్నాలు, పూర్తిసున్నాలు, త్రికోణాలు ఏకాగ్రతతో పదేపదే గీయవలెను. ఈసాధనయే మంచి పునాది వంటిది యగును.

**వలయుపరికరాలు:-** మంచి డ్రాయింగ్ పేపరు పొడవుముల్లుగల్గి నల్లగా మెత్తగా వ్రాసే, పెన్సిల్ శుభ్రంగా చెరిపే మేలురకం రబ్బరు 1 డ్రాయింగ్ బోర్డు



డిజైన్లు వేసేటందుకు సూత్రములు ;- రెండు సమాంతర రేఖలువేసి వాటిమధ్య వక్రగీతలు - పత్రరేఖలు - వృత్తములతో కూడిన రేఖలు గీయుటవలన సులువుగా డిజైన్లు వేయగల్గుతారు. సున్నా, అండా కృతులను ఎలా చిత్రించాలో సులువు పద్ధతులను వేసి చూపబడినది.

సులువులను గమనించిన చిత్రాలను ఖచ్చితంగా వేయవచ్చును. ఎన్నో సున్నలు - గుండ్లు బాగుగా గీయుటచేత కళాపటుత్వం వృద్ధి యగును. వేయుటకు ఎంతో ఆశక్తికరముగా ఉంటాయి.





తలను సున్నాను గీచి దేహానికి రేఖల్ని ఎలా వేసామో గమనించండి. రేఖల్ని మార్చి మార్చి గీస్తే వచ్చే రకరకాల భంగిమల్ని రూపాల్ని భావాల్ని సన్నివేశాల్ని గమనించండి. సాధన చేయండి. వీటినే స్టిక్ డ్రాయింగ్స్ అంటారు. చిన్నారులకు ఈ చిత్రాలు మనోల్లాసాన్నిస్తాయి. బోధనా విధానములో ఉపాధ్యాయులు సుఖతరంగా ఈ డ్రాయింగ్స్ సహాయంతోనే విద్యార్థుల మనోఫలకాలపై స్థిరంగా నిలచిపోయే విధంగా పాఠాలను చెప్పగల్గుతారు.

# స్టిక్ ఫిగర్స్‌తో కదలికలు




స్టిక్ ఫిగర్స్‌తో కదలికలు కళాభ్యాసానికి ఇవి పునాది నిస్తాయి.

ప్రయాణాలు, పెండిండ్లు, పెంపకాలు వంటివి స్కెల్టెన్ డ్రాయింగ్ సాయంతో చిత్రించాలి. స్కెల్టెన్ పై కండరాలు, దుస్తులు ఎల్లు వేయబడినవో అభ్యసించండి.



చిత్రకళకు పునాదివంటి ఈ స్కెల్టెన్ డ్రాయింగ్స్ బాగుగా నేర్చుకోండి. దీని పైమెట్టు కండర నిర్మాణము వస్త్రరచన వస్తుంది.

చురుకైన కదలికలు శిరస్సునకు మొండెమునకు ఎటువంటి సంబంధం ఉండాలో చిత్రించబడినది.




పరుగెత్తినా, కూర్చున్నా, వంగున్నా ఏ భంగిమనైనాసరే ఈ స్టిక్ ఫిగర్స్‌తో చిత్రించుకోవచ్చును. మనిషి దేహంలో అస్థిపంజరం ఎటువంటిదో, చిత్రరచనకు, ఈ స్టిక్ డ్రాయింగ్స్ అటువంటివి.



ప్రతీ చిత్రం కదలికలతో ఉండాలి. తక్కువ సమయంలో చిత్రించే విధానము. కొన్ని బ్లాకుల రూపాలతో చిత్రాల్ని గీయవచ్చును. శిరస్సునకు సున్నా చుట్టి దేహానికి ఆకృతులు ఎలా గీయబడ్డాయో గమనించండి.



వివిధ భంగిమలున్న మనుష్యులతో గ్రూపు చిత్రాలు చక్కని షేప్సలలో కంపోజింగ్ చేయబడినవి. సున్నా, కోల - ముక్కోణం షేపులు గమనించ గలరు.

స్టిక్ డ్రాయింగ్స్ చిత్రరచనకు పునాది నిస్తాయి.

పెద్ద ఆర్టిస్టులు ప్రారంభంలో బొమ్మకు వీటితోనే రూపకల్పలను చేసుకుంటారు.



ఈ సూక్ష్మ చిత్ర వ్యక్తులను వేయుటకు తలకు చిన్న సున్న-మొండానికి ఓ మాదిరి కోలాకారం - కాళ్ళకు 2 గీతలు - చేతులకు 2 గీతలు - కంటికి 1 చుక్క - ముక్కుకు చిన్న సున్న - నోరుకు ఒక రేఖ - గీసినచో చాలును.

మనుషుల వివిధ యాక్షన్స్ ఇట్లే వేసుకోవచ్చును,

# స్టిక్ - ఫిగర్స్ ప్రారంభ అభ్యాసము




ఈ స్టిక్ చిత్రాలు సులువుగా చిత్రించుటకు వీలగును. మనోభావాల్ని సులువుగా తెలియ జేయవచ్చును.

తరగతిలోని నల్లబల్లపై ఈ శైలి బొమ్మల నుపయోగించి పాఠ్యవిషయాలను బోధించే ఉపాధ్యాయులు పిల్లలకు అభిమానపాత్రులౌతారు.

**H. B.** పెన్సిల్‌తో ఈ సైజుకు లి రెట్లు గీయుటచేత స్పష్టంగా ఉండి సరియైన బాణీలో కళ వికసిస్తుంది. ఈ స్టయిల్ చిత్రాలు సులువుగా వుండి వేసే చిన్నారులకు ఆనందాన్నిస్తాయి.

సులువు రూపాలలో సుందర చిత్రాలు ఎన్ని తక్కువ గీతలతో బొమ్మను ఏ తీరున వేయాలో గమనించగలరు.

ఫినిషింగ్ వర్క్ జోలికి వెళ్ళవద్దు. ఇంకా సమయం వున్నది. పరిశీలించి చూస్తే ప్రతీ వస్తువులోను కళాత్మక సౌందర్యం కన్పిస్తుంది. భువిపై ప్రతీస్వరూపం చిత్రకళామయమే. ఒక్క క్షణం ఆలోచించండి.

3) స్టిక్ ఫిగర్స్ - టీచింగ్ డ్రాయింగ్స్



వీటిద్వారా శరీరంయొక్క మొత్తం కొలతలు బాగా గీయవచ్చు. బరువులాగుచున్నప్పుడు కాళ్ళు చేతులు నడుంయొక్క భంగిమలన్ని, కదలికలన్ని చిత్రించుటకు ఈ తరహా చిత్రాలు అభ్యాసం ప్రాణప్రదమైనవి. క్రమంగా వీటిపైన కండరాల స్వరూపాన్ని మలుచుకోవచ్చును. బరువులులాగే చిత్రాల్ని పరిశీలిస్తే మీకే డవలప్‌మెంట్ తెలుస్తుంది.



స్టిక్ డ్రాయింగ్స్‌తో ఎటువంటి ఊహా చిత్రాలకైనా భావానికి తగినట్లుగా చిత్రించవచ్చును. ఊహించి వేసిన చిత్రాలు అస్పష్టంగా కన్పిస్తాయి. పెర్ఫెక్ట్‌గా చిత్రించుటకు కావలసిన భంగిమల్ని, సహజసిద్ధంగా ఉండుటకు డైరెక్ట్ స్కెచ్చింగ్‌ను చేయాలి. 4 × 6 అంగుళాలు సైజు వైట్ పేపర్స్ బుక్‌పై 2బి పెన్సిల్‌తో మీరు నిత్యం చూస్తుండే సంఘటనలను, తక్కువ రేఖలతో రోజూ 60 స్కెచ్చెలు/నిముషానికి చొప్పున చిత్రించి ఇట్లే 180 రోజులు చేస్తే మీరు బెస్టు ఆర్టిస్టుగా, రూపొందుతారు.

# సుందరస్ఫూర్తి మత్వానికి సౌందర్యారాధన కళలు



మానవునికి మొహానికి తగిన సైజులోయున్న ముక్కు అందాన్నిస్తుంది. సర్వేంద్రియాణాం నయనం ప్రధానం కన్నులను చాలా క్షుణ్ణంగా నేర్చుకోండి. చెవులుకూడా ముఖానికి సంపూర్ణంగా వన్నె తెస్తాయి. వివరాలు ఎక్కువ లేకుండా గీయండి. హెడ్ స్టడీస్ తదేక ధ్యానంతో చేస్తే అందాలకే అందాలు చిత్రించే సౌందర్యారాధనా దృష్టి కల్గుతుంది. పెన్సిల్‌ను బాగా నడిపించే అధికారం కూడా వస్తుంది.

# "సౌందర్య స్వరూపాలు"



కన్నులు - ముక్కులు - నోళ్లు - చెవులు చూపబడ్డాయి. వివిధ కోణాల్లో ప్రక్కవాటితో పోల్చినప్పుడు ప్రత్యేకతలతో విభేదించి యుంటాయి. సౌందర్యకళకు ఇవే పునాది. వీటిని బాగా సునాయాసంగా ఊహించి వేసేటట్లుగా గీయడం నేర్చుకోండి! సాధకుడు శిరస్సులను సైడుఫోజు, 3/4 ఫోజు, ఫ్రంట్ ఫోజులలో పదే పదే వేస్తూండాలి. అప్పుడు తగిన కొలతలు గల కన్ను, ముక్కు, నోరు, చెవులు, ఫేస్ కట్స్ బాగా ఆకళింపు అవుతాయి.

## సుందర ముఖారవిందాలకు



సంపూర్ణ అందాల్ని చిత్రించాలంటే ఈ శిరోభాగాల్ని బాగా సునాయాసంగా నేర్చుకోండి !

మానవుని ముఖానికి సంపూర్ణ అందాన్నిచ్చేవి :-

1. ముక్కు, 2. కళ్ళు, 3. నోరు, 4. చెవులు.

సరైన పరిణామాలలో చిత్రించడం రావాలి.

ఈ భాగాలు సునాయాసంగా చిత్రించడం రావాలి.

తొలిప్రయత్నంలో ఎక్కువ వివరాలజోలికి పోకూడదు.

# శిరస్సు - ప్రాధాన్యత



శిరస్సుయొక్క కొలతలు యివ్వబడ్డాయి. రూపాలు అనేకరకాలు-రేఖలు అనంత అందాల సమ్మేళనాలు— ఈ చిత్రాలు నవ్వు, భయం, విచారంవంటి భావాల్ని ముక్కులయొక్క స్వరూపాన్ని చూపుచున్నాయి. సన్‌లైట్ ఎడమప్రక్కనుండి పడేటట్లుగా మీ స్నేహితుడిని కూర్చోబెట్టి రోజూ 12 చొ॥న బి. పెన్సిల్‌తో 3 అం॥లు సైజ్ హెడ్ స్టడీ స్కెచ్చెస్ ప్రాక్టీస్ చేయాలి. కనీసం ఒక్కొక్క స్కెచ్ 5 నిమిషములకు మించరాదు.

# వివిధ కోణాలలో శిరస్సులు




**H, B.** పెన్సిల్‌తో మీ ఫ్రెండ్స్ రూపాల్ని చూస్తూ హెడ్‌ని స్కెచ్‌లు వేయండి. అవి బాగా పోలికలు వస్తే 2B పెన్సిల్‌తో లైట్ అండ్ షేడ్స్‌ని వివరిస్తూ వర్కు చేయండి. చిత్రం 4 అం॥లు సైజువేస్తే సులువుగా పెన్సిల్ వర్కు చేయుటకు తగినదిగా యుండును. తలకు మెడకు భుజాలకు మధ్యగల సంబంధములను కొలతలను పరిశీలించండి.

శిరస్సులన్నీ గ్రుడ్డు ఆకృతినుండే రూపాంతరం చెందుతాయి!



సశాస్త్రీయ విధానములో, వివిధ భంగిమలలో మనిషియొక్క పాదములను సహజంగా, లాలిత్యంతో చిత్రిస్తే ఆరోగ్యకరమైన అందాల్నిస్తాయి. పాదముల వ్రేళ్లను వాటి గోళ్లును కూడా ఓర్మిగా చిత్రించాలి. రిలీఫ్కోసం ప్రక్కనున్న పక్షులు, డిజైన్ రేఖల మానవులు - కోతి, మొసలి చిత్రాలను గీయండి. చేతివ్రేళ్లు-కాలివ్రేళ్లు చిత్రణను జూచి సాధకుని బుద్ధికుశలత గ్రహించవచ్చును.

పూర్వ కళాకారుల బొమ్మల్ని పరిశీలిస్తే అందులో చేతుల వ్రేళ్లు-కాలివ్రేళ్లు ఎంతటి ప్రతిభతో చిత్రించినారో తెలుస్తుంది.





లతలు; కూర్చున్న స్త్రీలు ఊహా చిత్రాలు - నిల్చొన్న వ్యక్తులు మోడల్ ప్రాక్టీస్ చిత్రాలు-కావల్సిన భంగిమలో అమర్చి కొని చిత్రించుట చాలా గొప్ప సాధన. నిజ అభ్యాసకులకు సహజ సుందరమూర్తుల చిత్రకల్పనా రచన లభించును. కొలతలు; లయలు; లావణ్యములు; బేలన్సులను పాటించాలి. తక్కువ రేఖలు గీయుట ఎక్కువ అందానికి బాటలు వేయుట-ముందు నిల్చున్న మోడల్‌ను స్టడీ చేయాలంటే తగిన కంటిమట్టంలో ఉండునట్లుగా అమర్చుకోవాలి!

# స్కెచ్చెస్ చేయు విధానము :



రోజూ మీ ఇంట, పరిసర ప్రాంతాలలో ఈ భంగిమలు కాన వస్తాయి. ప్రతీ కదలికలోను ఎక్కువ సహజత్వం ఉట్టి పడ్తాయి

ఈ చిత్రాల్లో శరీర సౌష్టవ చిత్రణ సంక్షిప్తంగా చూప బడినది. నిత్యం ఈ రకమైన 1 నిమిషం చిత్రాలు అనగా స్పీడ్ స్కెచ్చింగ్ చేయుటవలన తక్కువ రేఖలతో రూపములను చిత్రించే నేర్పు వస్తుంది. అభ్యాసము కూసువిద్య. అనునిత్యం బొమ్మలు వ్రాయగా, వ్రాయగా ఆర్టిస్ట్‌గా అవుతారు.

# నిత్యం చేసే స్కెచ్చింగ్



ఏ భంగిమనైనా పరిశీలించినప్పుడు, ఆ భంగిమలలో విసూత్న మైన అందాలు కన్పిస్తాయి. వానిని చురుకుగా తడుముకోకుండా వేయాలి. ప్రతి భంగిమలోను రెండు కాళ్లు, రెండు చేతులు స్పష్టంగా కన్పిస్తున్నాయి. ఆర్టిస్ట్‌గా కాగోరినారా? 2 రకాల నెం. 2బి-4బి గ్రేడ్ పెన్సిల్స్, 1 స్కెచ్ బుక్‌ను సిద్ధంగా ఉంచుకోవాలి. అందమైన భంగిమ కన్పిస్తే ఆలస్యం లేకుండా వెంటనే గీయాలి. అది కాస్సేపటిలో మరచిపోతారు. కోల్పోయిన సహజ భంగిమను మళ్ళీ పొందలేము. స్కెచ్చి వేస్తే మరుపురాదు. కాగితంపై ఆ భంగిమ శాశ్వతంగా వుంటుంది.




ఫేస్ కొలతలు:- ముఖారవిందాలలో నవరసాలు రూపురేఖలు మిళితం చేసి చిత్రిస్తే ఆ చిత్రాలు కళాత్మక ప్రతిభను వృద్ధిపరుస్తాయి; చిత్రకళారంగ సంజీవదేవ్, సాయి, వేమనగార్లు మానవుల్లో పరమహంసలు- చిత్రరచనద్వారా వారి రూపాల్ని చిత్రించుకోగలం. రూపరచన చేయు ప్రక్రియ ఒక్క చిత్ర శిల్ప కళలకే గలదు. శిరస్సుమధ్యగా బేలన్స్‌లైన్‌ను వేసుకొని ఈప్రక్క ఆప్రక్క ముఖపార్శ్వములు సమానంగా గీయండి.

# ఫేస్ ఈజ్ ఇండెక్స్ అఫ్ ది మైండ్!




ఆ—ఆలోచన చేయండి! ఇది ఎన్నో మనోభావాలకు ముఖాల కవళికలే గుర్తు! నవరసాలు, వ్యంగ్యాలు, హావభావాలు, శిరస్సుల కొలతలు సృష్టించండి! సాధించండి! హావభావాలులేని బొమ్మలు రసరహితం. శోభారహితం! ఇక్కడ 15 కార్టూన్లు 4 సామాన్యమైనవి! 9 హావభావాల చిత్రాలున్నాయి. కథాచిత్రాలు-నటనాసంఘటనలు చిత్రించుటకు ఈ నవ విధ భావ ప్రదర్శనా రచనాశక్తి అవసరము; ఈ నవీనకాలములో యివి బాగా నేర్చుకొన్నవారికి గొప్ప భవిష్యత్ కలదు.

# ఆబ్జెక్టివ్ డ్రాయింగ్ వస్తుచిత్రణ




వస్తువులు ఎప్పుడూ గ్రౌండ్ లైన్ను - లంబరేఖలు, సమాంతర రేఖలు, కోణరేఖలు సహాయంతో చిత్రించబడియుంటాయి.

గ్రౌండ్ లైనుకు మధ్యను 1-2 రేఖ లంబరేఖ, 1ఎ, 1బి లైన్సు కోణరేఖలు-1ఎ,1బి.1-2 సి,డి,ఇ రేఖలచే ఘనపు పెట్టె వచ్చింది. క్రింద పెట్టె పైన 1-2కి మీదగా ఎం, ఎన్ లు ఎత్తుగల స్థూపం చిత్రించబడింది ప్రక్కన రైలుపట్టాలు, దీపపు స్తంభాలు, రేఖలలో జంతువులు చిత్రించబడ్డాయి.

చిరంజీవులారా :- మీరు అందమైన మనుష్యుల బొమ్మలు బాగా వేయాలంటే ముందుగా గృహోపకరమైన వస్తువుల్ని బాగా చిత్రిస్తే చేతికి పెరస్పెక్షను వస్తుంది. ప్రతీ వస్తువుకు మధ్యగా బేలన్సు లైను వేసుకొని దాని ఆధారంగా వెయ్యండి. వస్తువులు వాలిపోవు. చలించని వస్తువుల్ని బాగా గీయడం నేర్చినవారికి చలించెడి జీవజాలములను బాగుగా గీసేశక్తి కల్గుతుంది.

"గురువాక్కు"



బాడిలాగుచున్న స్టిక్ డ్రాయింగ్సను తాడు లాగుచున్న కండలుగల మనిషి డాన్సు చేసేవారి ఫ్రంట్ పోజ్, 3/4 పోజును బండి త్రోయుట, నీళ్ళు మోయుట, కావిడి స్టిక్ ఫిగర్సలో యాక్షన్‌లను స్ఫురించునట్లు 10 సార్లు వేయండి. తగిన సైజులో పొడవుండు దేహ సౌష్టవ నిర్మాణముయొక్క వంపులు భంగిమల కూర్పులు, రేఖల మృదుత్వాం, రూపాల సహజత్వం అలవడతాయి. అశ్లేప పశులు; గుర్రం; తోరణ డిజైన్సను సాధన చేయండి. కావలసిన చిత్రం ఊహతో వేయాలి.

# త్రీస్టెప్స్ పద్ధతిలో పక్షులు



కర్రపట్టినచేతికి దండ కండలు స్పష్టంగావస్తాయి. పక్షుల్ని వేస్తుంటే ఆనందంగా ఉంటుంది పక్షుల కాళ్ళు, వ్రేళ్ళు గోర్లు పరిశీలనగా వేయండి చుక్కలలో ఆయాపక్షుల యొక్క ఆకృతులు గీయబడ్డాయి. ఆకృతులు నీట్‌గా ఫినిషింగ్ చేయుటచూడండి. తలకు చిన్నకోల, పొట్టకు కొంచెం పెద్దకోలాకారం ఎల్లుగీసి వాటిని ఆయాపక్షులను రూపొందించుటేమో గమనించండి.



గుణాలకు గురుతులు! వేకువజామునే లెమ్మని కూసే కోడిపుంజు శ్రద్ధకు, నెమలి పవిత్రతకు, హంస నిర్మల జ్ఞాన గ్రాహ్యమునకు, కొంగ జపమునకు, పావురం శాంతికి, కాకులు ఐకమత్యమునకు, ఎగురుచున్న పక్షులు గడుస్తున్న కాలమునకు/బల్లెం విసురుచున్న వాడు లక్ష్యసాధనకు/పోటీపడుచున్న వాడు - శక్తి ప్రదర్శనకు గుర్తు/ రేఖలు సహజత్వం ఉట్టిపడేట్లు, పక్షియొక్క నిజ స్వరూపం వచ్చేటట్లు తగిన దేహపరిమాణం పొడవు మందం, ఎత్తులుండేట్లు వేయాలి.

# పుష్ప చిత్రణం (లోయర్ & హైయ్యర్)



గులాబీలను జూస్తూ సహజంగా ఉండు రంగులతో చిత్రించాలి. పెన్సిల్ స్కెచ్‌పై నీళ్ళలో ముంచిన బ్రష్‌ను తీసుకొని పువ్వు అంతటికి నీళ్ళ కోటింగ్ ఇవ్వండి. నీటితడి ఆరుతూ ఉన్న సమయంలో పువ్వు యొక్క సరైన రంగుల్ని పేలట్‌పై కలుపుకొని బ్రష్‌తో ఆ పుష్ప భాగాల్ని పెయింట్ చేయండి. చివరిసారి కోటింగ్‌తో పనిపూర్తి చేయాలి.

క్రిమిజన్ రెడ్‌తో లైట్‌టోన్స్ నుండి డార్క్‌టోన్స్ ఇవ్వండి. వాటర్, మీడియంలో లైట్ నుండి డార్క్‌కు పెయింటింగ్ చేయాలి.

# జంతువులు వాటి స్వరూపాలు :-



27

ప్రతి జంతువుకి ఒక విలక్షణమైన రూపం ఉంటుంది. ఆభేదాల్ని గమనించి తగిన కొలతలతో గీయాండి. తాబేలు స్థలాభావంచేత నిలువుగా వేయబడినది పుస్తకమును అడ్డంగా త్రిప్పి జూచి నేలపై ప్రాకుచున్నట్లు వేయాలి.

బండ ముల్లుతో వేస్తే జంతువుల, మూతి భాగాలు బండబారి పోతాయి. మనిషిని శిరస్సునుబట్టి దేహాన్ని చిత్రించినట్లే దేహాన్ని శిరస్సును ఆధారంగా జేసుకొని చిత్రించాలి!

# జంతువులు - వాటి పరుగులు



జంతువుల్ని చిత్రించడం గొప్ప అనుభవం యాక్షన్ జంతువులు చిత్రించాలి, వీటిని చక్కగా సహజంగా వేయాలి, నిలబడిన వాటికంటే పరుగెడుతున్న జంతువులు ఎంతో అందంగా ఉంటాయి. కొమ్ములు, తోకలు మరికొంచెం స్థలాన్ని ఆక్రమిస్తాయి. అందువలన కొమ్ములు చెవులు నుండి కాళ్ళవరకు నోటినుండి తోకవరకు కొలతలు తీసుకొని చిత్రించాలి.

# పెరస్పెక్టివ్-జంతువులు-వస్తువులు

అంచెలంచెలుగా గోవును చిత్రించుట-

వస్తువులను చిత్రించిన వారుగొప్ప సాధకులు అవుతారు.

పెరస్పెక్టివ్ ను బాగాభావించిన సమస్యలు

దృష్టిక్రమమును పరిశీలించాలి

దగ్గర వస్తువులు పెద్దవిగా, ముదరరంగులతోను దూరం వస్తువులు చిన్నవిగా, లేతరంగులతో ఉంటాయి.

1నుండి 6 స్టెప్సులలో అంచెలు వారీగా ఆవును ఎట్లు చిత్రించాలో చూపబడినది. వస్తువులు చూచే స్థానాన్ని బట్టి వివిధ విధాలుగా ఉంటుంది. దృష్టి క్రమమునందు ఏ వస్తువులైనను మన కంటికి దగ్గర నుండి దూరముగా పోవుకొలది, దాని సహజ పరిమాణములో చిన్నదిగా కన్పించును. వృత్తములు-పుస్తకములు-స్థూపములు- బంతులు యొక్క స్థానములలో అవి పొందు మార్పులు చూడుము.

తెరచిన పుస్తకమునకు గీచిన రేఖలు చూడుము.

# ఆబ్జెక్టివ్ డ్రాయింగ్ (లోయర్ & హైయర్)




ముక్కాల పీటను వేసిన వారు గుండ్రని వస్తువుల్ని సులువుగా గీయగలరు. మనం నిత్యము చూచే గృహావస్తువులలో ఎన్నో కలక సూత్రాలు నిక్షిప్తమైయున్నవి. వీటిని బాగావేస్తేనే గుడ్ ఆర్టిస్ట్!

కంటి మట్టమునకు వస్తువులుపైకి, క్రిందకిఉండే దూరములను బట్టి పొందే మార్పులు, ఈ సూత్రము ప్రతీ చిత్ర రచనయందును మిళితమై యుండును. వస్తువులను వివిధ భంగిమలలో అమర్చి సాధన చేయుము. చుక్కల్లో సూత్రాలు చూడుము.

# దక్షిణ భారత టర్నర్ - శ్రీ భగీరథి
# ప్రకృతి ఆరాధనాత్మక చిత్రకారుడు



శ్రీ భగీరథి ప్రకృతి అందాలకు అందాలు దిద్దిన అపర విశ్వామిత్రుడు లాండ్ స్కేప్ ఆర్ట్‌కి తెలుగుతల్లి కీర్తిని విశ్వవ్యాప్తి చేసిన నిష్కామకర్మ యోగి. శ్రీషిర్డీ సాయి సద్గురుని నిజదాసుడు. ఈయన అంతరాత్మ దేశభక్తి నిగల్గినది. అనకాపల్లి తాలూకా మామిడిపాలెంలో తే 21-7-1901న పుట్టారు. కూర్ద్రేకిశిష్యుడై శ్రీ దామెర్లకు వరదాగార్లకు ప్రియమిత్రుడై కళలోని రహస్యాల్ని నేర్చారు.

నచ్చిన దృశ్యాన్ని సింపిల్‌గా స్కెచ్ వేసుకొని లైట్ & షేడ్స్ కలర్ కాంబినేషన్స్‌లను పెన్సిల్‌తో నోట్ చేసుకొని ఇంటివద్ద దానిని కావల్సిన సైజ్‌లో చిత్రించేవారు. ది 19-11-1950 న దేవతల ఆహ్వానంపై శివలోకమునకేగిన అమరుడు. అపరరంగ దేవుడు.

1




2




3




4




5




6




వస్తువులు, చెట్లు, మనుషులుయొక్క గ్రూపు చిత్రాల్ని కూర్పు కూర్చే పద్ధతులు. చిత్రరచనకు కావలసిన వాటిని కంపోజింగ్ చేసే మెథడ్స్ పాటించి, చిత్ర సముదాయములను అద్భుతమైన ప్రక్రియలలో పెరఫెక్ట్‌గా కంపోజింగ్ చేయు విధానము. ఈ 6 సూత్రాలలోనే యిమిడియున్నది. పాత కళాగురువులు చిత్రాల్ని పరిశీలించండి. వాటిలో ఈ గ్రూపు కూర్పులుంటాయి. గ్రేట్ ఆర్టిస్టుల అచ్చయిన బొమ్మలు పరిశీలించండి.

# లేండ్ స్కేప్ పెయింటింగ్ :











హొరైజన్

ఆకాశ రేఖ దగ్గరగా నున్నవి
పెద్దవి వేయాలి




భూమిని ఆకాశమును కలుపు
సంధి రేఖ. దగ్గరవి చిన్నవిగా
చిత్రించుటవలన
దూరంగా ఉన్నట్లు కన్పించును




ఆకాశ రేఖ వద్ద
పెద్ద మేఘములు.
పెద్దవిగా పక్షులు వేయాలి
2-2, దగ్గరవి చిన్నవి గాను
1 రేఖ ప్రాంతంన వేసినవి
మధ్యస్థంగాను గీయాలి.

చెట్లు దగ్గరగా ఉన్నవి కావున పెద్దవిగా వేయబడినవి
2-2, దగ్గర గల వన్నియు చిన్నవిగా వేయుటచేత
దూరం కన్పిస్తున్నది -

కెమేరాలు చూపలేని అందాల్ని లేండ్ స్కేప్ ఆర్టిస్ట్ తన కుంచెల నడకలతో సుందరవర్ణ సమ్మేళనాలతో హృదయాల్ని పులకింప జేస్తారు. ప్రకృతిచిత్రాలు, పంచేంద్రియాలను పరవసింపచేస్తాయి!

కళ కళ కోసం - ఫోటోగ్రఫీ - ఫోటోగ్రఫీ కోసం కళ హృదయ కుహురాల్లోంచి పుట్టుకురావాలి పైకి, కన్పించని మనోభావాలకు రూపాల్ని కల్పించడమే పరిపూర్ణ కళాధ్యేయం! ఇంద్రధనస్సులోని **VIBGYOR**- వైలెట్, ఇండిగో, బ్లూ, గ్రీన్, ఎల్లో, ఆరంజి, రెడ్ లతో ఎట్టి ప్రకృతిదృశ్యాలనైనా వేయవచ్చును.

## "లేండ్ స్కేప్ కి స్కెచ్చెస్"



స్కెచ్ లను పెన్సిల్ లైట్ గాతో వేసి-కంటికి కన్పించే విధంగా ఇంద్రధనస్సులోని సప్తవర్ణాలైన, క్రిమిజన్-రెడ్, ప్రషియన్ బ్లూ, వైలట్, క్రోమ్ ఎల్లో, లెమన్ ఎల్లో ఎల్లో ఓఖర్, ఆరంజ్, గ్రీన్, వెర్డియన్ గ్రీన్, లీఫ్ గ్రీన్, డీప్ ఎల్లో, ఇండిగో, లైట్ గ్రీన్, బరంట్ శయనా, వంటి రంగులతో డార్క్, మిడిల్, లైట్ గ్రేడ్స రంగుల మిశ్రమంతో రమ్యంగా చిత్రించగలరు! ప్రకృతిలోని అందమైన రంగుల్ని చూచివేయండి! సాధకునికి ప్రకృతి రమణీయకతే సజమైన గురువు.

# అవుట్‌డోర్ సీనరీలు
















నదిలో పడవలు. చెట్లు కొండలు: పూరిపాకలతో ప్రకృతి శోభాయమానం జీవితానికి ఆధారంగావించుకొనుటకు ప్రకృతిని బాగా ఆరాధించండి ప్రతిసీనరీలోను మనుషులు, జంతువులు, పక్షులయొక్క రూపాల్ని సింపిల్ చిత్రించండి. బొమ్మలకు నిండుదనంవచ్చి కంటికి హాయినికల్గిస్తాయి ఇతర్లు గీచిన చిత్రాల్ని చూచివేస్తే గొప్పకాదు. నీవు స్వంతంగా నీబుద్ధికి తోచినదిచేయుము అదియే నిజమైన గొప్ప కృషి ప్రగతికిమార్గము.

# స్కెచ్చింగ్ - కలర్‌మిక్సింగ్



ప్రకృతిని చిత్రించుట అదృష్టముగా భావించాలి. చిత్రంలో దగ్గర వస్తువులు పెద్దవిగాను, దూరంగా ఉన్నవి చిన్నవిగాను చిత్రించుటవంటి తారతమ్యాల్ని పాటించాలి. దగ్గరవాటికి రంగులు చిక్కగా కాంతివంతంగాను దూరంగా యున్నవాటికి లేత రంగులను వేయాలి.

1. రెడ్, ఎల్లో, ప్రషియన్ బ్లూ.

2. ఆరంజ్, గ్రీన్, వైలెట్, డార్క్‌గ్రే. ఈ కలర్స్‌ని అక్కడ దృశ్యంను బట్టి కావలసినట్లుగా వాడాలి.

# చెట్లు షేపుల్లో అందాలు



రకరకాల రూపాలలో









చెట్ల యొక్క ప్రధాన ఆకృతుల్ని ముందుగీచి ఆ తరువాత కొమ్మల్ని, ఆకుల గ్రూపుల్ని, వెల్గునీడల్ని చిత్రించాలి అనేకరకాల చెట్ల స్వరూపాలు చిత్రించబడ్డాయి. ఈ విశ్వంలోగల ప్రకృతి అనేక రకాలైన పోలికలలో ఉంటాయి. ఏ చెట్లనైనా మొదలకు చెట్టుయొక్క ఆకుగుబురుల సమూహామును తేలికగా వివరణలేకుండా సహజ ఆకృతిని చిత్రించాలి. చెట్లను స్వేచ్ఛగా చిత్రించండి పేపరుకు తగిన సైజుల్లో గీయండి బా॰గా॰ పెద్ద సైజులలో చిత్రించవద్దు

# ఆహ్లాద ప్రకృతి




ఇంటివద్ద బాలురు ఏటిని పెన్సిల్‌తో 1/4చార్ట్‌సైజు ఆర్ట్ పేపర్‌పై పెన్సిల్‌తో సాధనచేయాలి. దగ్గరచెట్లకు నల్లని పెన్సిల్‌తో రేఖలను దళసరిగావేయాలి. దూరమున్న చెట్లను తేల్చి వేయాలి. నచ్చిన దృశ్యాన్ని జూస్తూ రంగులువేయాలి ఊహించి ప్రకృతిదృశ్యాలను వేసిన రంగుల్లో జీవంలేదు యధాతథంగా స్పాట్‌కివెళ్ళి చేసిన సాధనకే నిజమైన సహజత్వం వస్తుంది ఇది భవిష్యత్ కళాకారులకు దివ్యమార్గము

# తెలిసిన జంతువులు వాటి ప్రపోర్షన్స్



నేటి ప్రాథమిక, ఉన్నత, కాలేజీ విద్యా సంస్థలలో విద్యార్థులకు సులభముగా అర్థమగుటకు చిత్రలేఖన కళే ఆధారమైనది. జంతువుల రూపము, సహజముగా ఉండునటుల వేయుటను ఏనిమేషన్ ఆర్టు అంటారు. ఇవి కథా చిత్ర రచనకు, ఊపిరివంటివి. సింపిల్ లైన్స్‌తో వాటి రూపాలు ఏవిధంగా చిత్రించగల్గితిమో తెలుసుకొని అట్లే రూపభేదాల్ని అభ్యాసం చేయండి. ఎక్కువ రేఖలచేత సులువుగా ఆకృతులను గీయండి. గీచిన బొమ్మ గుర్తుండేటట్లు నేర్చుకోవాలి!

చిత్రకళా పితామహుడు, కళానిధి

## శ్రీ వరదా వెంకటరత్నం మాష్టారు



తే. 5 అక్టోబరు 1895 న పుట్టారు. ఒ. జె. కూల్డ్రేగారి శిష్యులు. దామెర్ల రామారావుమిత్రులు, దామెర్ల రామారావు స్మారకచిత్రకళా పాఠశాలను స్థాపించి 40 సం॥లు ప్రిన్సిపాల్‌గా జేసి రత్నాలవంటి శిష్యుల్ని జాతికి అందించారు. ఈయన చిత్రాలు జగన్మోహన సౌందర్యాల్ని గల్గినవి. సిల్కువస్త్రంపై చిత్రించుటలోను, పారదర్శక జలప్రక్షాళనశైలి రంగులను వేయుటలోను సిద్ధహస్తుడు. కళామర్మము లను దాపరికం లేకుండా విద్యార్థులకు బోధించిన మహాత్ముడు. ప్రభుత్వ ట్రైనింగ్ కాలేజీలో చిత్రకళాచార్యునిగా పనిచేసారు. నటరాజు, ఆదిదంపతులు, విలాసిని, ద్రాక్షారామం, గోదావరి ప్రకృతి సౌందర్యాల్ని చిత్రించిన ఋషి. తే 11-10-1963 న దివికేగిరి.

15

సరియగు విధానము కాదు

సరియగు పద్ధతి.

అ 

ఆ 

ఇ 

ఈ 

ఉ 

ఊ 

ఋ 





డిజైన్స్ వేయుటకు సహకరించే సూత్రములు

సరియగు పద్ధతిగా వేయుటకు అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ లలో సింపిల్ మోడల్స్ చూపబడినవి. లతలు వేయుటకు అన్ని వేళల సహకరించే సులువు పద్ధతులు ఇవియే. బాగా సాధన చేయండి. కొంచెం కొలతలు తీసుకొని ఖచ్చితంగా వేయండి. ప్రకృతియొక్క అనుకరణకు అవలంభించే సూక్ష్మతయే లతలు, వస్త్రాలు, దారుశిల్పాలు, బంగారు నగిషీలు, రాతిచెక్కడాలు, అల్లికలు, ఎంబ్రాయిడరీవంటి కళాత్మక పనిలో గమనించిన అలంకారమునకు ఈ డిజైన్లు మనోల్లాసాన్నిచ్చి వర్ణించరాని ఆనందాన్ని కల్గిస్తాయి.




అ ఆ లవంటి కొన్ని షేప్స చూపించబడ్డాయి. వాటిలో అనేక రకాలుగా నమూనాలు గీయబడ్డాయి. మీరు కొన్నింటిని కల్పించండి.

డిజైన్లను ఎట్లు గీయవలెనో ఈ క్రింద తెల్పిన పద్ధతులను గమనించి వేయుడు.

వ్యాపార కళకు ఈ డిజైన్లు-బేగ్రౌండ్సుకు బోర్డర్సుకు-వాడుకొన వచ్చును. లోయర్ అండ్ హైయ్యర్ పరీక్షలకు సూత్రాలు.

# లలితమైన "లతలు"



అజంతాగుహాని అలంకరించిన అపూర్వ లతలు-ఇవి 4 రెట్లు పెద్దవిచేసి రంగులు అందంగా కలర్ కాంబినేషన్స్‌తో వేయండి. ఇవి పెద్దసైజులో వేయుటవలన చేతికి సులువులు లభిస్తాయి. చేతికి రేఖాపరిజ్ఞానం కల్గుటకై పరీక్షలలో ఫ్రీహేండ్ అవుట్‌లైన్ డిజైన్ డ్రాయింగ్ అను పేపరు ఉంటుంది. గొప్ప నిపుణులు తమ విద్యార్థిదశలో డిజైన్సును కృషి చేసినవారే. ఈ జగమే డిజైన్సమయం. వస్త్రప్రపంచాభివృద్ధి. కేవలం ఈ డిజైన్ ఆర్టుపైననే అభివృద్ధి చెందింది. కొంచెం ఆలోచించినచో ఏ డిజైన్‌ను ఎక్కడ ప్రయోగించాలో సాధనచేత తెలుసుకోగల్గుతారు. కోడిపుంజుల చిత్రాలు కూడా కళాత్మక లతలేగదా!

# వస్త్రాలంకారణ డిజైన్లు



ఇవి ఎంతో సింపిల్‌గా చిత్రించాలి, కుడిప్రక్క గీచిన నమూనా ఎడమప్రక్క దానితో సమానంగా ఉండాలి. సగభాగం డిజైన్ గీయబడింది. దాని రెండో భాగంకూడా గీయవలెను. ఇది హేండ్ పెరపెక్షన్ కోసం బాగా సహాయపడుతుంది. వీటికి పూర్వం ఎంబ్రాయిడరీ చేసేవారు. ఇప్పుడు డ్రేపరీకలర్, పెవిక్రెల్ కలర్స్, కెమికల్ కలర్స్‌లను రంగులషాపువద్ద తీసుకొని, మీడియంతో బట్టలుపైన వేసినచో అందముగా ఉండును. రంగులు పువ్వులకు గులాబీ, రేకలు నారింజపండు రంగులు, ప్రక్కనున్న ఆకులకు ఆకుపచ్చ పూయవలెను. లైట్ రంగులతో పువ్వులకు ఆకులకు కూడా లైట్ & షేడ్స ఇచ్చుకోవచ్చు.

# కమర్షియల్ ఆర్ట్‌వలన లాభములు




సింపిల్ లైన్స్‌తో ఒక వ్యక్తిని 4 రకాలుగా చిత్రించుట - ఆ కూర్పుయొక్క నేర్పు గమనించండి! ఇది మనిషియొక్క ఆరోగ్యం పెంపొందించుటకు డ్రిల్లును చేయుట మంచిది అని తెలుపుచున్నది.

వ్యాపార చిత్రకళ స్వతంత్రంగా జీవించుటకు మంచిమార్గము. తల్లీ బిడ్డ, గుర్రం రౌతు, పొగత్రాగేవాని హృదయం, సింపిల్ రేఖలలో ఒక వ్యక్తి ఎక్సర్ సైజ్‌లలో మార్పులు. అందమైన అమ్మాయి. తలపాగా చుట్టుట, గీతల మార్పులు నేర్వండి.

# విద్యాప్రదాత - కళాప్రోత్సాహక శ్రీ మేడూరి



1964 నుండి 78 వరకు శ్రీ కందుకూరి వీరేశలింగ ఆస్తిక విద్యాలయాల సెక్రటరీ & కరెస్పాండెంట్‌గా పనిచేసి, చిన్న చెట్టును మహా కల్పవృక్షంగా అభివృద్ధి చేసారు. వృత్తిరీత్యా వ్యాపారి. ప్రవృత్తిరీత్యా విద్యాలయాల అభివృద్ధికి జీవితాన్ని అంకితం చేసిన మహా కృషీవలుడు. ఆత్మబంధువు. నా చిత్రాల్ని మెచ్చి నా గురుదేవులు శ్రీ సీతారామాచార్యులవారి తదనంతరం నా గురువుగారి కోరికపై నాకు చిత్రకళోపాధ్యాయుని ఉద్యోగాన్ని ప్రసాదించారు. నావలే ఎందరికో ఉద్యోగములిచ్చిన ఒక మహా వ్యవస్థ. గొప్పశక్తి శ్రీ మేడూరి. మనిషుల్ని నమ్మి విద్యాసేవచేసి "కృషిదేవోభవ" అని నిరంతరం పరిశ్రమతో రాజమండ్రి ప్రజలందరి ఆదరాభిమానాలతో ఆత్మీయతతో నవ్వుతూ నవ్విస్తూ జీవించిన శ్రీ మేడూరి అమరుడే!

# సాధకులకు సూచనలు

ప్రారంభంనుండి మంచి డ్రాయింగ్ పేపర్‌నే వాడండి. ముందు 1/4 ఛార్టు, తర్వాత 1/2 ఛార్టు, బాగా నేర్చిన తర్వాత ఫుల్ ఛార్టు డ్రాయింగ్ పేపర్లపై చిత్రించండి. ఫ్రీ హేండ్‌గా బొమ్మలు వేయండి. స్కేలు, జామెట్రికల్ బాక్సులోని ఏ రకమైన పరికరాల సహాయం పొందరాదు. ఏ చిత్రాన్నైనా వ్రాసేటప్పుడు దానిని ఎలా సింపిల్‌గా సులువైన గీతలలో వ్రాయలో ఆలోచించండి. రంగులు శాంపిల్‌కి తక్కువ నిష్పత్తిలో కలుపుకొని మీరు కోరిన టోన్/షేడు వచ్చినప్పుడు కావలసినంత నిష్పత్తిలో కలుపుకోవాలి. ప్రతీ బొమ్మలో సహజత్వం - అందం, చక్క భావము కలిసియుండాలి.

పూర్వ చిత్రకారులు తమ ఊహాల్ని 4 రకాల చిన్న చిన్న "[illegible]" స్కెచ్‌లు వేసుకొని నచ్చిన దానిని పెర్‌ఫెక్ట్‌గా చేస్తారు. దానిపై రంగుల్ని వేస్తారు. తొలుత వాటర్ కలర్స్ పెయింటింగ్ చేయుటలో పెర్‌ఫెక్షన్ పొందిన తరువాతనే ఆయిల్ కలర్ పెయింటింగ్‌ను సాధన చేయాలి! పెద్దసైజు వాటర్ కలర్ పెయింటింగ్ చేయుటకు అంతసైజు సన్నని పేపర్‌పై ముందు స్కెచ్ వేసుకొని దానివెనుక 6బి పెన్సిల్ ముల్లుతో నలుపుచేసి డ్రాయింగ్ పేపరుకు క్లిప్పులతో కదలకుండా అమర్చుకొని **2H** పెన్సిల్‌తో ట్రేసింగ్ చేయాలి. అది డ్రాయింగ్ పేపర్‌పై లైట్‌గా పడ్తుంది. దానిని **H. B.** పాయింట్ పెన్సిల్‌తో నీట్ లైన్ చేసుకోవాలి.

మొత్తం డ్రాయింగ్ పేపర్‌పై ఎల్లో ఓఖర్ + బరంట్ శయనా + తక్కువ వైట్ కలిపిన మిశ్రమమును పలుచగా నీళ్ళు తగువిధంగాకల్పి నెం: 12 బ్రష్‌తో బొమ్మ అంతటికి ఒక పూత పూయాలి. ఇది ఆరిన తరువాత కావలసినచోట అవసరమైన రంగులు వేసుకోవాలి.

క్రమక్రమంగా కలర్‌ని పూతపై పూత యిస్తూ డార్క్ టోన్‌లోకి చిత్రించుకోవాలి. తెలుపు రంగును పొదుపుగా తక్కువగా వాడాలి.

# భావి భారత జ్ఞాన చైతన్యసద్భావన

భావి భారత పౌరులారా!

భారతమాత అమృతపుత్రులారా!

స్వశక్తిపై నిల్వుము-ధీరుడవై యుండుము. బలాఢ్యుడవై యుండుము - సమస్త బాధ్యతను నీభుజముల మీదనే వహింపుము. నీవిధికి నీవే కర్తవని గ్రహింపుము. నీకువలయు బల సంరక్షణాలు నీయందే కలవు కావున నీ భవిష్యత్తును నీవే నిర్మించుకొనుము.

మీరు స్వతంత్రముగా ఆత్మతృప్తితో జీవించుటకై పసివయస్సు నుండే చేతి విద్యలందు కృషి సల్పి విశ్వాంబరమున భారతీయుల నిరుపమాన ప్రతిభను నికేతనమైచాటండి, మీసాధనలో ముమ్ముందుకు సాగిపొండి! ఎట్టి విపత్కర పరిస్థితుల యందైననూ వెనుదిరిగిచూడకండి ఆగకండి, గమ్యం చేరువరకు ముందుకు సాగిపొండి! ప్రపంచదేశాల ప్రగతికి తీసిపోని విధంగా భారతదేశ ప్రగతిని ఇనుమడింప జేయండి. స్వార్థాన్ని, మూర్ఖత్వాన్ని సోమరితనాన్ని మీదరికి చేరనివ్వకండి. గాలి, నీరు, నిప్పు జీవనానికి ఎంతముఖ్యమో ఆత్మ శుద్ధిని; తృప్తినొసంగే చేతి విద్యలో సాంకేతిక విద్యలు - విజ్ఞాన శాస్త్రాలు విశ్వమానవ మనుగడకు అంతముఖ్యము ప్రేమ, శాంతి, దయ, ధర్మం, జ్ఞానం, సద్భావన మనదేశ సంస్కృతికి ముఖ్యాంగాలు వీటిని కాపాడాలంటే ప్రతీ పౌరుడు సద్బుద్ధితో ఏదైనా ఒక విద్యయందు. పరిపూర్ణుడుగా కావలసినదే! తప్పదు!

శ్రీ వివేకానందస్వామీజీ